Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం II.] మద్రాసు : 1942 వ సం॥ ఫిబ్రవరి నెల 13 వ తేది శుక్రవారం [సె 6 రు.

## ఈ వారం యుద్ధ గతి.

### సింగపూరు ముట్టడి—లిబియా దాడి మందగించుట—రష్యాలో హిట్లరు వెనుకబడుట.

#### సింగపూరు.

సింగపూరు దీవిపై జపాను దాడి ప్రారంభమయింది. గత వారమంతా శత్రు సేనలు మలయా ద్వీపకల్పంలో దక్షిణమునకు వచ్చుచు, సింగపూరునకు అవతలొడ్డునయున్న జహోరు రాష్ట్రమునందు జమకూడినవి. జపాను ఫిరంగు లచట స్థావరమేర్పరచుకొని దక్షిణమున సింగపూరుపై ప్రేల్చడం మొదలుపెట్టినవి. వారి బాంబరు విమానాలుగూడ పనిచేయుచుండెను. సింగపూరును రక్షించుచున్న సేనలు పూరుకోలేదు ప్రపంచంలో కల్ల పెద్ద ఫిరంగుల చటున్నాయి. అవి జహోరు వైపు గుండ్లను ప్రేల్చి శత్రుసేనలను భేదించుచుండెను. రాయలు విమానదళంవారుగూడ తమ శక్తి చూపిరి. సివిలు ప్రజలు జనరలు వావెలుగారి హెచ్చరిక ననుసరించి ధైర్యంగానుండి లండను నివాసులవలెనే యీ దాడియొక్క కష్టాలను ఓర్చుకొనుచుండిరి. ఎట్లయితేనేమి, కటిక చీకటిలో ఆదివారం రాత్రి జపాను సేనలు కొన్ని, సింగపూరు ద్వీపం పడమర తీరాన దిగినవి. మరునాడు రాత్రి వాటికి సహాయంగా మరి కొన్ని సైన్యాలను దింపగల్గిరి. మన సేనలు తీవ్ర నిరోధం జరిపినపిమ్మట, వెనుకకు తగ్గి క్రొత్త రక్షణ శ్రేణి యేర్పరచుకొన్నవి. అటనున్న ఆస్ట్రేలియా సేనల నాయకుడు మేజరు జనరలు గార్డను బెనెటు గారు, సమయంమించిపోలేదనియు, వచ్చిన శత్రు సేనలను తరిమివేసి సముద్రంలో త్రోసివేయుటకు ప్రయత్నించుతున్నామనియు చెప్పిరి.

పశిఫికు సముద్రమునందు యితర ప్రాంతములందు జపానువారికి ఓటమి గెల్పుకూడ కల్గుచున్నవి. ఫిలిప్పైను దీవులందు బాటను ద్వీపకల్పమునందు అమెరికను సేనాని మాకార్థరుగారు, యింకను నిరోధించుచునే యున్నారు. అందుచేతనూ, ఎదురుగా దారికడ్డంగానున్న కారిగిధార్ కొండకోట యింకను అమెరికనుల చేతిలో నుండుటచేతను, తాము వశపరచుకొన్న మనీలా హార్బరును, నౌకాశ్రయమును జపానువారు ఉపయోగించుకోలేరు. అంబోయినా అను చిన్నదీవి యింకను జపాను సేనల దాడిని నిరోధించుచునేయుంది, కాని న్యూబ్రిటను నెలిబీసు దీవులందు శత్రువులు సేనలదించగల్గిరి. అందుచే ఆస్ట్రేలియాకు అపాయం చేరువయింది, నెలిబీసు దక్షిణకొననున్న మకాసరు రేవునందు ఒక జపాను సైనిక దళం దిగినట్లు తెలిసెను. ఇవటనే జపాను నౌకాదళంపై పక్షం దినముల క్రిందట మిత్రమండలి నౌకా విమాన దళములు తీవ్ర దాడి జరిపి విశేషనష్టం కలిగించినవి. బోర్నియో, నెలిబీసు దీవులమధ్యనున్న యీ మకాసరు జలసంధిని శత్రువులవశం కానివ్వరాదు. అది వారి వశమయినచో జావా దీవికి చాల ముప్పుకలుగును. మిత్రమండలి సైనికాధికారులు యీ జలసంధిని కాపాడగలరని నమ్మవచ్చును. జావాలో సౌరబాయయందు మిత్రమండలి నౌకాదళ కేంద్రంగలదు. ఇపుడు సింగపూరు ముట్టడి జరుగుచున్నందున యిదియు యింక చాల ముఖ్యమయినది. దీనిపైని, జావా ముఖ్య పట్నమగు బటేవియా నగరంపైని జపాను విమానాలపుడే పెద్ద దాడి ప్రారంభించినవి. సముద్ర మార్గమున నేల మార్గమునగూడ దాడి సాగించుటకు ముందు వారిట్లు విమానదాడి జరిపెదరు. మిత్రమండలి సర్వసేనానియగు జనరలు వావెలుగారు బర్మాకుపోయి, యిపుడే యిచ్చటకివచ్చి, శత్రువును తరిమివేయు సాధన చేయుచున్నారు. ఆస్ట్రేలియాకూడ రక్షణకార్యములను మరింత బిగువు చేసుకొనుచున్నది. ఆస్ట్రేలియా విదేశ మంత్రి ఫోర్డిగారు చెప్పినట్లు తమ తీరాలు రక్షించుకొనుటేగాక, తరువాత తూర్పు ఏషియాను, పశిఫికు ప్రాంతాలను విడిపించుటకుగూడ ఆస్ట్రేలియా తోడ్పడవలసి యున్నది.

#### బర్మా యుద్ధం.

బర్మాలో సాల్వీనునదీ తీరమునందు దాని సాగరసంగమంవద్ద మర్టబను పురమునుండి 50 మైళ్లు ఎగువ ప్యాగంవరకు నిలిపియుంచబడిన బ్రిటిషు సేనలు ఇండియను సేనలును జపానువారిని నిరోధింపగల్గినవి. కాని శత్రువులు మర్టబనుకు తూర్పున 25 మైళ్లలోనున్న పానుపురము నాక్రమింపగల్గిరి. రక్షణ కోస్తా తగ్గించుకొనుటకును, చుట్టువేయబడకుండా తప్పించుకొనుటకును మన సేనలు మర్టబనుపురము విడచినను విడువవలసి వచ్చును. విడచినచో, అవి జపాను గెలుపుగా ఎంచరాదు. తమకనుకూలంగానుండు చోట నిలచి తీవ్ర ప్రతిఘటన చేయుటకే మిత్రమండలి అట్లు చేయును. బర్మా గవర్నరుగారు నిస్సందేహంగా రేడియో ఉపన్యాసమునందు చెప్పనేచెప్పిరి. ఎన్ని కష్టాలకైనా ఓర్చి బర్మాను, ముఖ్యంగా చీనాకు ప్రాణప్రదమగు రాదారి ద్వారమగు రంగూన్ను రక్షించెదముకాని విడువమని గవర్నరుగారు చెప్పి, ఆ విషయమునగల సందేహాలను తొలగించిరి.

బర్మాలో యిపుడు బ్రిటిషు సేనలున్న శ్రేణికి ఉత్తరముగ, అడవి ప్రదేశములందుగూడ, శత్రువులు రాకుండ చీనా సేనలు కాపాడుచున్నవి. ఇండియాను రక్షించుటకు చీనా సిద్ధంగావుందని యిపుడు ఢిల్లీకివచ్చిన మార్షలు చాంగ్ కై షేకు గారు నమ్మ బలికిరి. చీనాలో వారి సేనలు కాంటనుకు 75 మైళ్లు దూరంలోనున్న వైచోనగరాన్ని తిరిగి తీసుకొని, తూర్పునదీ తీరాన్ని పకోస్లోపురమునుగూడ తీసుకొని, కాంటనువైపు జపాను సేనలను తరిమివేయుచున్నవి.

జపాను వాణిజ్య శాఖమంత్రియగు కిషిగారు, యీ వారం తన దేశీయులను హెచ్చరించుచు, తూర్పు ఏషియాలో యుద్ధం యిప్పుడే ప్రారంభమయినదనియు, యికముందు యింకా ఎక్కువ కష్టాలకు ఓర్చియుండాలనియు తెలిపిరి. వారిమాట నిజమే కావచ్చును.

#### లిబియా.

ఈ వారం లిబియాలో యుద్ధగమనం జోరుగా లేదు. బ్రిటిషు సేనలు, జర్మను సేనలు గజాలా చుట్టుపట్ల ఎక్కడనుండెనో అక్కడనేయున్నవి. గజాలా తీసుకున్నామని శత్రువులు ప్రకటిస్తున్నారు కాని యింకా బ్రిటిషువారి చేతులలోనే యుంది. ఈ పురికి 50 మైళ్లు దూరాన మన కాపలా సేనలు చురుకుగ పనిచేయుచున్నవి ; తిరుగుదాడులు సల్పుచున్నవని జర్మనులంటున్నారు. కాని జర్మను సేనాని జనరలు రోమెల్లుగారు తిరిగి తీవ్రదాడి ప్రారంభించేటట్లున్నారు. సముద్ర తీరాన టోబ్రుకువైపు వారు దాడిచేయదలచి

యుందురు. ఆ వైపే ఎక్కువ సేన పరికరాలు ఆతడు జమచేయుచున్నట్లు మన కాపలా సైన్యాలు తెలుపుచున్నవి. నిజమగు కుస్తీకి యిరుపక్షముల వారు తమ సేనలను జతచేసుకొనుచున్నట్లుంది. ఈ పోరు గజాలావద్ద జరుగునో యింకెక్కడ జరుగునో సరిగ చెప్ప వీలులేదు.

రోమెలుగారికి ఎక్కువ సహాయంగా క్రొత్త సేనలు పరికరాలు వచ్చినట్టుంది. విషీ (ఫ్రాంసు) అధికారుల అనుమతిపై హిట్లరు ఫ్రెంచి టునేషియా ద్వారా సరకు పంపుచున్నాడు. విషీ నాయకులు ఇట్లాచేస్తారని తెలిసే యిదివరకు జనరలు వేగాండు విషీ ప్రభుత్వాధికారులతో ఏకీభవించక, యీ మోసం యిష్టంలేక, సేనాధిపత్యం వదలుకొనెను. అమెరికా ప్రభుత్వం విషీ ప్రభుత్వ చర్యను నిరసించుచు, రోమెలుగారికి ఫ్రాంసుద్వారా సహాయం చేరకూడదని నిరసించుచు వ్రాసెను. దానికి జవాబు సంతృప్తికరంగానుండకపోతే, యిపుడు ఫ్రాంసులోని బాధితులకు ఫ్రెంచి ఉత్తరాఫ్రికాలోని బాధితులకు అమెరికా ఆహారం పంపుచున్న సహాయం మానేస్తుంది.

సముద్ర మార్గంలో శత్రునౌకలేని ఆఫ్రికాలో రోమెలుగారికి సహాయం తీసుకరాకుండా బ్రిటిషు విమానాలును యుద్ధ నౌకలును కాపాడుచున్నవి. అనేక స్టీమరులు పూర్తి సరకుతో ముంచబడినవి. ఇటలీనుండి అమెరికాకు పోతున్న సప్లై స్టీమరులలో $\frac{1}{3}$ వంతు యీరీతిగా ముంచివేయబడినవి.

## రష్యా యుద్ధం.

రష్యనులు యీ వారం చెప్పుకోదగ్గ పెద్ద పట్నంఏదీ పట్టుకున్నట్లు ప్రకటించలేదు. కాని ముందుకు పోతూనే వున్నారు. వందలకొలది గ్రామములను శత్రువులనుండి విడిపించుచు, శత్రువులకు చాల నష్టం కలిగించుచుండిరి. ఒకచోటనేగాక, యీపని అన్ని యుద్ధరంగాలలో జరుగుచుండెను. హిట్లరు వసంత ఋతువులో తిరిగిదాడి ప్రారంభించే లోపునే ఎంత వీలయితే అంత ప్రదేశం తిరిగి ఆక్రమించుకోవాలని రష్యనులు ఉద్దేశించిరి. లెనినుగ్రాడును ముట్టడినుంచి పూర్తిగ విడిపించాలి; స్మోలెంస్కు నగరం చేరాలి, ఉక్రైనులో డ్నీపరు నదివరకుగల పారిశ్రామిక స్థలాలు తిరిగి ఆక్రమించాలి, క్రిమియానుండి శత్రువులను తరిమివేయాలి. లెనినుగ్రాడు—స్మోలెన్స్కు రంగము నందు రష్యను సేనానియగు జనరలు జుకోవుగారు, శత్రువుల రాథారినడ్డి మంచి విజయం పొందుచున్నారు. మాస్కో నగరంనుండి శత్రుసేనలు దూరానికి తరిమివేయబడినవి.

ఆనగరానికి డానిజ్జి బేసిను నుండి రైలుపైని వోల్గా కాల్వపైని, సప్లైలు వస్తున్నవి. దక్షిణమున ఉద్దండుడగు మార్షలు టిమొషంకోగారు దక్షిణ యుక్రైనునందలి శత్రుస్థానములను రెండు వైపులనుండి చుట్టివేయుచు, వసంత ఋతువులో గూడ హిట్లరు కాకసను రాష్ట్రానికి పోవీలులేకుండ చేయుచున్నాడు.

రష్యాలో హిట్లరు సేనలు వెనుకబడుట యుక్తి కొరకుగాదు, యిష్టముండి కాదు, విధిలేక వెనుకకు తగ్గుచున్నవి. రష్యనులు వారిని మరీ మరీ వెనుకకు తరుముతూవుంటే, ఎచటను స్థావరముండి రక్షణ శిబిరమేర్పరుచు కొనలేకుండా వున్నారు. చివరకు "ఇక వెనుకకు పోరాదు" అని గూడ హిట్లరు ఉత్తరువు చేసెనట. ఇంక ముందెన్నడో ఉపయోగించదలచిన తాజా రిజర్వు సేనలనుగూడ, యిపుడే రష్యనుల తిరుగు దాడి నరికట్టుట కుపయోగించెను. కాని యింతవరకు యేమీ విజయం కలుగలేదు. ఒకటిమాత్రం నిజం! రష్యాదాడిలో హిట్లరు తన సేనలో మేలు యువకులను బలియిచ్చెను. వారికి వీరు తోడు.

---

# జపాను కొట్టెడి తేనెపట్టు.

## చైనా - జపాను మొండి యుద్ధం.

చైనాతో జపానువారు యుద్ధం ప్రారంభించి ఇప్పటికి నాలుగున్నర సంవత్సరము లైనది. ఈ నాలుగున్నర సంవత్సరములనుంచీ చైనా సైన్యాలు వికటీతగా మొండిపట్టుదలతో యుద్ధం చేస్తూనే ఉన్నాయి. ఒక్కొక్క పట్టణాన్ని జపాను సేనలు ఆక్రమించడం, తిరిగి దానినే చైనా సేనలు పట్టుకొనడం; మరల కొన్నాళ్లకు మరొకమారు ఆపట్టణమునే జపానువారు వశపరచుకొనడం ;—యీ విధంగా అయిదారు సారులు ఆపట్టణం వీరి వశంలోనుంచి వారివశంలోకి, వారివశంలోనుంచి వీరి వశంలోకి; వారిచేతులలోనుంచి, వీరి చేతులలోకి వీరి చేతులలోనుంచి వారి చేతులలోకి మారుతూ ఉన్నది. పెళ్లికూతురు, పెళ్లికొడుకు పూలబంతి ఆట ఆడినట్లుగా ఒక్కొక్క పట్టణం ఆవిధంగా చేతులు మారుతూ ఉన్నది. ఇంత అసాధ్యమైన మొండి పోరాటం ఇంకెక్కడా జరగడంలేదు. అయితే, మనం ఒక్క విషయం ఆలోచించాలి. జపాను వాళ్లకు ఆయుధాలు తయారు చేయగల పెద్ద పెద్ద సొంత ఫ్యాక్టరీలు జపానులో ఉన్నాయి. చైనాకు అటువంటి ఆయుధ యంత్రాగారాలు లేవు. జపాను సేనలు కొత్త కొత్త ఆయుధ సాధనాలను ఉపయోగించడంలో బాగా శిక్షణ సాధకం పొంది ఉన్నాయి. అటువంటి కొత్త కొత్త యుద్ధ తంత్రాలన్నీ చైనా సేనలకు చిరపరిచితంగాలేవు. ఇటువంటి చైనా సేనలు, అటువంటి సర్వసమర్థములైన జపాను సేనలను నాలుగున్నర సంవత్సరాలనుంచీ వివిధంగా ఎదిరించగల్గు తున్నారు. అంత సమర్థత గల జపాను సేన నాలుగున్నర సంవత్సరములనుంచి ఎడతెగకుండా యుద్ధం చేయుచున్నప్పటికీ, చైనాను ఎందుచేత జయించలేకుండా ఉన్నది? జయించడానికి యింతదుస్సాధ్యముగా ఉన్న చైనా రాజ్యంమీద జపానుకు ఇంకా ఇంత ఆశ, ఇంత కాంక్ష ఎందుకు? ఈ విషయాలు చాలా చిన్న ప్రశ్నలుగానే పైకి కన్పిస్తాయిగాని, ఆ ప్రశ్నలకు జవాబు చెప్పగల్గితే చైనాయొక్క నిజతత్వం, బలం బయట పడుతుంది.

### చైనా తేనెపట్టు.

అసలు, యీ చైనారాజ్యం చాలాబ్రహ్మాండమైనది. ఇంచుమించు ఇది ఇండియా రాజ్యమంత వుంది. ఇండియాకన్న పెద్దదేగాని, చిన్నదికాదు. మన ఇండియా దేశంలో 40 కోట్ల జనసంఖ్య ఉంటే, చైనాదేశంలో $40\frac{1}{2}$ కోట్ల జనసంఖ్య ఉంది. చైనారాజ్యంలోని భూప్రదేశం కొండలు, నదులు, లోయలు, వాగులు మయమై ఉంది. దేశమంతటా విరివిగా రైలుమార్గములు అల్లిబిల్లిగా విస్తరించి లేవు. కాని, అంత విస్తారమైన దేశంలో వ్యాపారం చేయడానికి జపానువంటిదేశం పూనుకొంటే, సాలుకు ఎన్నికోట్ల సరకునైనా అమ్ముకొని, ఎన్ని కోట్ల ద్రవ్యలాభమైనా గడించవచ్చు. చైనాలో విశేషంగా పెద్ద యంత్రాగారపరిశ్రమలు లేకపోవడంవల్ల జపానుకు అంత దురాశకలిగింది. చైనాదేశంలో ఏవైనా పెద్ద రైలుమార్గములు నిర్మించడానికిగాని, ఆనకట్టలు కట్టడానికిగాని, మంచి కంట్రాక్టుపనులు జపానువారు సంపాదించితే, ఎన్నికోట్ల లాభమైనా జపానులోని ఇంజనీరింగు కంపెనీలు సంపాదించవచ్చు. కాబట్టి చైనాదేశంలో చైనావాళ్లు సొంత ఫ్యాక్టరీలు వృద్ధిచేసికొని, తమ సరకు తామే తయారు చేసికొని స్వయంసమర్థులు కాగూడదని జపాను కోరిక. చైనాదేశంలో స్వదేశీ యంత్రపరిశ్రమలు వృద్ధిపొందాలనిగాని, స్వదేశీ వస్తు సామగ్రులను చైనావారే తయారు చేసికోవలెననిగాని, జపానువాళ్ల కోరిక కానేకాదు. చైనాదేశం ఎప్పుడూ అసమర్థదేశంగానే ఉంటూ ఉండి, ఎల్లకాలములందూ, జపానువారి సరకులనే కొనుక్కుంటూ, జపానువారికే తమ ద్రవ్యాన్నిగాని, తమ పాడి పంటలనుగాని సమర్పించుకొంటూ ఉండాలని జపానువారి కోరిక. చైనాలో అనేక గవర్నమెంటు డిపార్టుమెంటులు ఉంటాయి గనుక, ఆ డిపార్టుమెంటు లన్నింటిలోను, జపానువారు తమ జనానికే పుష్కలంగా ఉద్యోగాలన్నీ చూపించి, చైనావాళ్ల సొమ్మును చక్కగా అనుభవిస్తూ, చైనాలో మరొకదేశమువాళ్లు అడుగు పెట్టకుండా, మరొకదేశమువారు తమకు పోటీగా సరకులను చైనాలో అమ్ముకొనుటకు వీలులేకుండా, చైనాలోని ప్రభుత్వాధికార పదవులను తామే చలాయిస్తూ, నామమాత్రంగా చైనాను

ఒక ప్రత్యేక స్వతంత్రరాజ్యంగా ఉంచవలెనని జపానువారు ఒక పెద్ద ప్లాను సంకల్పించుకొన్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే, దీని అర్థం విమిటంటే, చైనా ఎప్పుడూ స్వయం సమర్థతలేని అసహాయ రాజ్యంగా ఉండాలి, చైనాకు కావలసినవన్నీ జపానువారే సప్లయిచేస్తూ, చైనాయొక్క అయిశ్వర్యమంతా జపానువాళ్లే కైంకర్యం చేస్తూఉండాలి. చైనా ఎప్పుడూ మైనరుగానే ఉండాలి. ఆ మైనరుకు జపాను మాత్రమే సదా గార్డియనుగా ఉండాలి. చైనాకు ధర్మకర్తలుగా జపానువాళ్లుఉండి చైనా దేవస్థానపుఆస్తినంతా జపానువాళ్లే ఆరగిస్తూ ఉండాలి. చైనాలో ఉండే జనం కష్టపడి పండించే పంటనూ, నిల్వచేసుకొనే సొమ్మునూ విటేట జపానువారు స్వాహాచేస్తూ వుండాలి. తేనె టీగలన్నీ కష్టపడి పోగుచేసిన తేనెనంతనూ, ఒక్కసారిగా ఆ తేనె పట్టులోనుంచి జపానువారు చక్కగా తాగి వేయవలెనని బయలుదేరినారు. చైనామీదకు జపానువారు దండెత్తడానికి ఇదే కారణం.

జపానుకు చైనా దేశం దగ్గరగా అందుబాటులో ఉన్నది. చైనావాళ్లూ, జపానువాళ్లూ ఒక్కటే రంగు జాతిలోకలిసినట్టి సమీప రక్తసంబంధం కలవాళ్లు గనుక "చైనా దేశం అనే తేనెతుట్టెను|కొట్టుకొని, ఆ తేనెను తాగడానికి ఆదేశం మాకు మాత్రమే భుక్తంలో ఉండాలిగాని, యితరులెవరికీ ఆ తేనె పట్టులోని తేనె త్రాగడానికి అవకాశం యివ్వము" అనిజపానువాళ్లు తమ మనస్సులో నిశ్చయించుకొన్నారు. చైనా తేనెపట్టులోని తేనెను తాగవలెనని ఆశఉందిగాని, ఆ తేనెపట్టులోవున్న తేనెటీగలనుపారదోలి జయిస్తేనే తప్ప ఆ తేనెపట్టు చేతికిచిక్కదు. తేనె పట్టు దగ్గరకువెళ్లి ఒక సారి కర్రతో కదలించగానే, తేనె టీగలన్నీ జుమ్మని వెంటపడ్తాయి. ఒళ్లంతా కుట్టి పీడిస్తాయి. అక్కడనుంచి వెళ్లిపోయేవరకు వెంటపడ్తాయి. ఆ తేనెటీగలు నలువైపులా చెలరేగుతాయి. తమ తేనెపట్టు దగ్గరకు రానివ్వకుండా, ఆ తేనెపట్టును ఎంత రోషంతో, ఎంత పట్టుదలగా కాపాడుకుంటాయో, తేనెతుట్టెలను పట్టుకొన్నవాళ్లకు తెలుస్తుంది. ఆ తేనెపట్టును రక్షించుకొనడానికి, ఆ తేనె టీగలలోఉండే అయికమత్యం అత్యద్భుతంగా ఉంటుంది. అవి ఎంతపట్టుదలగా తేనెను కొంచెం కొంచెంగా తెచ్చి ఎట్లా నిల్వచేసినాయో, ఆ తేనె పట్టునుకూడా అంతపట్టుదలగా రక్షించుకుంటాయి. చైనా దేశానికి ఉత్తరపు సరిహద్దుగా ఒక పెద్ద ప్రాకారపుగోడ కట్టబడిఉన్నది. ప్రపంచంలో ఏ దేశానికిన్నీ ఆ విధంగా ప్రాకారం నిర్మింపబడలేదు. ప్రపంచంలో, మహాద్భుతమైన మనుష్య నిర్మాణములు ఉన్నాయి. ఈ అద్భుతమైన నిర్మాణములలో ఒకటి "తాజమహలు"—ఇది మన ఇండియాదేశంలో ఆగ్రా నగరంలో యమునానది ఒడ్డున ఉన్నది. చంద్రకాంత శిలలతో షాజహాను చక్రవర్తి తన భార్యయైన మంటాజు బేగమునకు ప్రేమపూర్వకంగా కొన్ని కోట్లద్రవ్యం ఖర్చుచేసి కట్టించిన సమాధి ఇది. ప్రపంచంలోని రెండవ అద్భుతవిశేషం ఏమిటంటే, చైనా దేశానికి ఉత్తర సరిహద్దుగా నిర్మింపబడిన బ్రహ్మాండమైన ప్రాకారపుగోడ. అనేక శతాబ్దాలక్రింద కట్టిన గోడ యిది. చైనావాళ్లు తమ దేశాన్ని కాపాడుకొనుటలో ఎంత పట్టుదలగలవాళ్లో ఆ చైనా ప్రాకారమే తెలియజేస్తుంది. చైనా దేశంలో అనేక రాష్ట్రాలుఉన్నాయి. అనేక పార్టీలుకూడా వున్నాయి. $40\frac{1}{2}$ కోట్ల జనసంఖ్యలో ఎన్ని అభిప్రాయ భేదాలైన ఉండవచ్చు. ఎన్ని పార్టీ భేదాలైన ఉండవచ్చు. కాని, యీ చైనా తేనెపట్టును కొట్టవలెనని జపానువాడు ప్రయత్నించే సరికి, చైనాలోని అన్ని పార్టీలవాళ్లూ ఒక్క మాటమీద నిలువబడి తమ ప్రభుత్వాధ్యక్షుడైన చాంగు కే షైక్ ఎట్లా చెప్పితే అట్లావిని, ఆయన ఆజ్ఞ శిరసావహించి పోట్లాడుతున్నారు.

## చాంగ్ కై షేకుగారి రాక.

చాంగు కే షైక్ గారు మొన్న చైనానుండి విమానంమీద ఢిల్లికివచ్చారు. వైస్రాయికి అతిథిగా ఉన్నారు. చాంగు కే షైక్‌గారికి స్వాగతమిస్తూ వైస్రాయిగారు సభలో ప్రసంగించారు. వైస్రాయిగారు తమకుచేసిన మర్యాదకు మళ్లీ జవాబు చెప్పుతూ చాంగ్ కే షైక్‌గారు రత్న మాణిక్యాలవంటి రెండు మాటలుఅన్నారు. "బుద్ధ భగవానుడు యీ భారతదేశంలో అవతరించి ప్రపంచానికి బోధించిన బౌద్ధమతము మా చైనా దేశంలో వ్యాపించింది. ఈ భారత దేశంలోని ప్రశస్తమైన గొప్ప వేదాంతసారమకరందమును రమారమి. రెండువేల యేండ్ల క్రిందనే చైనానుంచి ఇండియాకు జ్ఞానదాహంతో వచ్చిన బౌద్ధ యాత్రికులు తనివితీర త్రాగినారు. (1) ఫాహియాన్, (2) హుయాను సాంగ్ అనే చైనా యాత్రీకులు యీ భారతదేశ విజ్ఞానమునే చైనాకు మూటగట్టుకుని తెచ్చినారు.' భారతీయులు రచించిన అమూల్యమైన వేదాంత గ్రంథాలు చైనాలో పురాణప్రమాణాలుగా శిరసావహింపబడుతున్నాయి. కనుక, ఇండియాకు చైనాకు ఉన్న పరస్పరమైత్రి యీ నాటిది కాదు రెండువేల యేళ్లనుంచీ ఏర్పడినమైత్రి. మీ వేదాంతామృత పానముచేసినవాళ్లము మేము.

చాంగ్ కే షైకుగారు మరొక మాట అన్నారు :—" మీ భారతదేశంలో ఉద్భవించినటువంటి రవీంద్రనాథ టాగూరుగారు సర్వలోక పూజ్యుడైన మహాకవి. ధర్మస్వరూపుడైన మహా తతవ్వేత్త. జపానుయొక్క అధర్మ ప్రవర్తనను ఆయన ఖండించాడు. అక్రమంగా అన్యాయంగా రాజ్యాల మీదకు దండెత్తేటటువంటి జపానువాళ్లు దురాత్ములని దూషించాడు. 'అక్రమంగా జనసంహారం చేస్తున్న ఆ జపానువాళ్ల పాపిష్టి నెత్తురు చేతులతో భారతీయులు తమ చేతులు కలిపి స్నేహం చెయ్యలేరు. ఆరక్త సిక్తహస్తమును భారతీయులు అంటుకొనలేరు.' అని లోకానికి వెల్లడించాడు. కనుక, స్వర్గస్థుడైన ఆ రవీంద్రకవీంద్రుని మాటలు మరొకమారు మీరు స్మరణ చేయండి!"

## బర్మాలో చైనా సేనలు.

ఈ రోజున జపాను సేనలు సింగపూరులో అడుగుపెట్టి, బ్రిటిషు సింహంతో [illegible] అహోరాత్రులు పోట్లాడుతూ అగ్నివర్షం కురిపిస్తున్నాయి. జపాను సేనలు బర్మాలో మోల్మీను వద్దకు చేరినవి. కాని సాల్వీను నదిని దాటలేకుండా ఉన్నాయి. బర్మాలోని యీశాన్య సరిహద్దులవద్ద ఉన్న షాన్ పరగణాలలోనికి జపాను సేనలు దండెత్తవలెనని ప్రయత్నిస్తున్నాయి. అక్కడినుంచి బర్మాలోకి ప్రవేశించవలెననిన్నీ, బర్మానుంచి చైనాలోకి పోయే రస్తాను ఆక్రమించవలెననిన్నీ,జపానువారు సంకల్పించుకొని ఉన్నారు. చైనాలో ఉన్న చైనా సైన్యాలకు బ్రిటిషువారున్నూ అమెరికావారున్నూ కలిసీ అపారంగా ఆయుధ సామగ్రిని సప్లయి చేస్తున్నారు. ఈ సామగ్రిని యావత్తూ బర్మాలోనుంచి ఉత్తరంగా చైనాలోనికి పోయేటటువంటి రస్తామీదగా మోటారు లారీల మీద పంపిస్తున్నారు. చైనావారికి యీ విధంగా ఆయుధ సామగ్రులను పంపించిన కొలదీ, చైనాలో ఉన్న జపాను సేనలను చైనా పటాలములు తుక్కు తుక్కుగా చావగొట్టివేస్తున్నవి.' ఆ కారణంచేత, బర్మా-చైనా రోడ్డును ఆక్రమించి అరికట్టవలెననే ఆతురతతో జపానువాళ్లు అహోరాత్రాలు విరహతాపం పడుతున్నారు. ఈ సంగతి అంతా బ్రిటిషు సేన్యాధిపతియైన వావెలుగారు ఇటీవల చైనాకు వెళ్లి చాంగు కై షేకుగారితో సవిస్తరంగా చెప్పి బోధపరిచారు.

బర్మాలో జపానువాళ్లను అడుగుపెట్టనివ్వకుండా చెయ్యాలి.బర్మా-చైనారోడ్డును ఆక్రమించుకొనకుండా చెయ్యాలి. ఇదే కర్తవ్యం. కనుక, బర్మాలోనికి చైనా సేనలు వచ్చి జపానువారితో యుద్ధం చెయ్యవలసియున్నది. ఈ సంగతి అంతా చాంగు కై షేకుగారు గ్రహించి, వెంటనే చైనా సేనలను బర్మాలోకి పంపించారు. రెండు నెలలనుంచీ చైనా సేనలు రామదండు లాగున బర్మాలోనికి దిగుతూనే ఉన్నాయి. బర్మా యీశాన్య భాగంలో ఉన్న షాన్ పరగణాలలో చైనా సేనలు మకాముచేసి ఉన్నాయి. జపాను సేనలను చైనాలో ఎట్లా పీడిస్తూ చైనా పటాలాలు నాలుగున్నర సంవత్సరములనుంచీ పోరాడుతూ ఉన్నాయో, అదేవిధంగా ఇప్పుడు బర్మాలోకూడా జపాను సేనలను హద్దుదాటి రానివ్వకుండా చెయ్యడానికి చైనా సేనలు తండోపతండాలుగా బర్మాలో చేరుతున్నాయి. ఈ చైనా తేనెటీగలు జపానువాళ్లను దగ్గరకు రానిచ్చేటట్లుగా లేవు. జపానువాడు ఎక్కడికి వస్తే అక్కడకు యివికూడా ఝుంకారం చేస్తూ ముసురుతున్నాయి. నలువైపులకు ముసురుతున్నాయి. నాలుగున్నర వేళ్లనుంచీ జపానువాళ్లతో యుద్ధం చేసిన అనుభవం యీ చైనా సేనలకు ఉంది. ఈ చైనా తేనెటీగలు జపానువాణ్ని పీడిస్తూ ఉన్నా, చైనా తేనెతుట్టెమీద కోరిక యింకా జపానువాడికి పోలేదు.

ఈరోజున చైనాతేనెపట్టుకోసం చెయ్యిజాచినట్లుగానే, రేపు ఇండియాతేనెపట్టుకోసం జపానువాడు చెయ్యిచాచుతాడు. ఎలుగుగొడ్డు తేనె తుట్టెలకోసం చెట్లకు ఎగబాకినట్లుగా అడవులలోనుంచి త్రోవచేసుకొని కొండలలోనుంచి త్రోవచేసికొని జపానువాడు అష్టకష్టాలూపడి వనున్నాడు.

కనుక, ఇండియా సైన్యాలు, చైనాసైన్యాలు, బ్రిటిష్ సైన్యాలు కలిసి చైనా తోనెపట్టును జపానువాడు చేబట్టకుండా చెయ్యాలి. జపానువాళ్ల కర్మబర్మాలోనే చెయ్యాలి అనే పట్టుదలతో బ్రిటిష్‌వారు, చైనావారుకలిసి నిర్ణయించారు. చాంగుకై షేకుగారు ధర్మపత్నీ సమేతంగా చైనానుంచి ఢిల్లీకివచ్చి వైస్రాయితో యీ విషయాలు మాట్లాడినారు. షాన్ పరగణాలలో ఉన్న చైనా సేనలను బ్రిటిష్ సేనానియైన వావెలుగారు స్వయంగాచూచి, ఆ చైనా సేనల వీరావేశానికి ఆశ్చర్యపడుతున్నారు. చైనాలో ఉన్న మేలుజాతి మొదటిరకం యోధులుగల పటాలములనే చాంగుకై షేకుగారు బర్మాకు పంపిస్తున్నారు. కనుక ఇక బర్మాలో జరుగ బోయేది బ్రహ్మాండమైన యుద్ధం. అసలు యుద్ధం యీావత్తూ ఇక ముందు జరుగవలసియున్నదని జపాను మంత్రికూడా మొన్ననే అన్నాడు.

## చైనాకు బ్రిటిషువారి అమెరికావారి సహాయం.

చైనా సేనలను యీ విధంగా బర్మాలో యుద్ధం చెయ్యడానికి చాంగుకై షేకుగారు పంపిస్తే బ్రిటిష్‌వారు, అమెరికావారు చైనాకు కనకవర్షం కురిపిస్తున్నారు. బ్రిటిష్‌వారు చైనాకు 5 కోట్లపౌనులు (అనగా రమారమి 67½ కోట్ల రూపాయలు) ద్రవ్యసహాయము చేస్తున్నారు. అమెరికావారు చైనాకు 50 కోట్ల డాలర్లు (అనగా రమారమి 175 కోట్ల రూపాయలు) ద్రవ్యసహాయం చేస్తున్నారు. ఈ విధంగా అమెరికావారు, బ్రిటిష్‌వారు కలిసి, వెరశి 242½ కోట్ల రూపాయలద్రవ్యం చైనాకు సహాయం చేస్తున్నారు. యుద్ధం చేసేవాళ్లకు రూపాయలిస్తే విశేషప్రయోజనం ఉండదు. పటాలములకు జీతము లివ్వడానికి, దుస్తులు, తినుబండారాలు, కొనడానికి కొంతపైకం కావలసి ఉన్నప్పటికీ, ముఖ్యంగా ఆయుధాలు, విమానాలు, ఫిరంగులు కావాలి. వీటినే అమెరికావారు గంగాప్రవాహంగా సప్లయి చేస్తున్నారు.

చైనా సేనలు సిద్ధంగానే ఉన్నాయి. చైనా సేనలకు ఆయుధాలుకూడ సిద్ధంగా ఉన్నాయి. కనుక చైనాకు ఇక అభ్యంతరం ఏమిటి? "చైనాలో చేస్తున్న యుద్ధం బర్మాలోకూడా చెయ్యనా?" అంటోంది చైనా. ఇక "జపానువాళ్లను జయించనా?" అంటోంది చైనా. మన వైస్రాయితో అందుకే చేతులు కలిపి చాంగు కై షేకుగారు "షేకుహాండు" చేస్తున్నారు. జపానువాళ్లకు పుట్టిన రాజ్యకాంక్ష వాళ్లను మన్య జ్వరంలాగున పట్టుకొని పీడిస్తోంది. [ఏప్రిల్ మాసం వచ్చేసరికి జపాను సైన్యం మలయామన్యంలో మలేరియా జ్వరాలు వచ్చి, తప్పకుండా మంచమెక్కగలదనిన్నీ అపుడీ జపానుసైన్యంలో చూడోవంతు భాగమైనా మన్య జ్వరంతో మూల్గుతూ సీల్గుతుందనిన్నీ సర్ మాల్కం వాట్సను అనే మన్యజ్వర వైద్యవేత్త మొన్న లండనులో అన్నాడు.]

మామూలు మలేరియా జ్వరానికి క్వైనామాత్రవేస్తే పోతుంది. కాని, జపానువాళ్లకు పుట్టిన మన్యజ్వరం మరొక రకమైన అన్యజ్వరం. అది పరరాజ్యాలను భక్షించాలనే దురాశవల్ల పుట్టిన జ్వరం. ఇది మామూలు మన్యజ్వరం కాదు. ఇతరుల మాన్యాలు హరించవలెననే, రాజ్యకాంక్ష జన్యజ్వరం. ఈ విధమైన అన్యమాన్య దాహజ్వరానికి క్వయినా మాత్ర పనిచెయ్యదుగాని, చైనామాత్ర బాగా పని చేస్తుంది. అందుకనే బ్రిటిష్‌వారు చాలా దూరం ఆలోచించి బర్మాలోకి చైనా సైనిక భ్రమరాలను రానిచ్చారు. ఈ చైనాతేనె టీగెలన్నీ రోషావేశంతో బర్మా రోడ్డు మీదుగా యుద్ధఝుంకారం చేస్తూ అహంకారముతో కారాలునూరుతూ వస్తున్నాయి. ఇంకా వస్తున్నాయి. అంతులేకుండా వచ్చి మూగుతున్నాయి. జపానువాడికి బర్మాలో భరతం పట్టిస్తాయి.

## జపాను నౌకా నష్టం.

ఇక్కడ బర్మాలో యీ కర్మకాండ జరుగుతూ ఉంటే, జపానువాళ్ల నావలను డచ్చియీాస్టుయిండీసువారు ఊరుపేరు లేకుండా రూపుమాపుతున్నారు. 63 రోజులలో 56 నావలను ముంచివేసారు. ఇదే సమయమనిచెప్పి, అమెరికావారి యుద్ధనావలుకూడా బయలుదేరి వచ్చాయి. హవాయి లంకలనుండి బయలుదేరి న్యూజీలాండులోని వెల్లింగుటను రేవునకు చేరినాయి. అమెరికను యుద్ధసామగ్రులను, సైన్యాలనుకూడా అమెరికానుంచి ఆస్ట్రేలియాకువచ్చే సముద్రమార్గంలో అనేక మకాములలో మధ్యమధ్య దింపుతున్నారు. బర్మాలోకిపోవాలనే ప్రయత్నంలో జపానువాళ్లుంటే అమెరికానుంచి ఆస్ట్రేలియాకు, న్యూజిలాండుకు అమెరికను సైన్యాలను, యుద్ధనావలను చేర్చి, ఆసముద్రమార్గముకూడా అమెరికావాళ్లు బందోబస్తు చేస్తున్నారు. ఇక చూచుకోండి. జపానువాడికి అటుచూస్తే నుయ్యి, ఇటుచూస్తే గొయ్యి అన్నట్లుగా వ్యూహం తయారవుతోంది. ఇక ఉత్తరానికీ పోలేడు దక్షిణానికీ రాలేడు. తిరిగీ తూర్పుగావున్న తనదేశానికి మరలి పోవాలి. లేదా జపానువాడు అమెరికావైపుకు ఇంగ్లాండు వైపుకు తూర్పుగా తిరిగి ఒక్కనమస్కారంచేసి అస్త్రసన్యాసంచేసి యుద్ధం చాలించాలి. జర్మనీతో స్నేహంచేసినందుకు చర్మం పగిలేటట్టు చెంపలు వేసుకోవాలి. బ్రిటిషు యుద్ధతంత్రం అప్పుడుగాని బోధపడదు. అప్పుడు మళ్లీ సింగపూరు శృంగారంగా సిగలో పువ్వు రాలకుండా, వాడకుండా విజయలక్ష్మిలాగు వచ్చి బ్రిటిషు సింహ పీఠమునకు హారతు లిస్తుంది.

అమెరికావారిబలం ఫిలిప్పయిను దీవులలో విజృంభిస్తోంది. లింగా యను సముద్ర శాఖలో జపాను సేనలు బాగా దెబ్బతింటున్నవి. శివరాత్రికైనా తప్పకుండా లింగాయను సముద్రతీరం జపాను సేనలకు రుద్రభూమి అవుతుంది. ప్రస్తుతం లింగాయను వద్దనే బలంగా దెబ్బతింటున్నారు జపానువాళ్లు.

## రష్యాలో జర్మనుల అపజయం.

ఇక్కడ జపానువాళ్లు ముందుకు పోవాలని ఎట్లా తమ గొయ్యి తామే తవ్వుకుంటున్నారో, అట్లాగే అక్కడ రష్యాలో జర్మనీవాళ్లుకూడా ముందుకు వెళ్లినందుకు ఫలితంగా చిందరవందరగా పిరికి పంతలై వెనుకకు పారిపోతున్నారు. రష్యా ఉత్తర రణరంగంలో కాలినినువద్ద కాలికి బుద్ధి చెప్పుతున్నారు దక్షిణ రంగంలో యూక్రేనులో జర్మను సేనలను రష్యాసేనలు ఖార్కొవుదగ్గర కాచుకో దెబ్బ అని జర్మను పటాలమును పటాపంచలు చేస్తున్నాయి. ఎక్కడి మందు సామగ్రి అక్కడే పారవేసి పారిపోతున్నాయి జర్మను సేనలు. కాని, జర్మను రేడియోలో బడాయిమాటలుమాత్రం తగ్గలేదు. ఇదంతా ఒక యుద్ధ తంత్రంకోసం వెనకకు వస్తున్నామని జర్మనులు తమ జర్మను రేడియోలో చెప్పుకుంటున్నారు. యుద్ధతంత్రంకోసం వెనకకు పోయే వాళ్లు కట్టుదిట్టంగా మూటకట్టుకొని వెళ్లాలిగాని ఎక్కడి ఫిరంగులక్కడే విడిచిపెట్టి, బ్రతికితేచాలు భగవంతుడా, అని మ్రొక్కులు చెక్కలై దిక్కుమొక్కులేకుండా పారిపోతారా? వాళ్లు ఎట్లా పారిపోతున్నారో స్వయంగా రష్యాకు వెళ్లి యుద్ధరంగంలోచూచి మొన్న కరాచీకి వచ్చిన మిస్ క్యాగీ అనే ఆవిడ ఆమాట ప్రత్యక్షసాక్ష్యంగా చెప్పింది. ఎవరికైనా ఆరంభంలో ఉన్న ఆర్భాటం చివరకు పటాటోపం అవుతుంది.

## లిబియాలో యుద్ధం.

జర్మనులు రష్యాలోని మంచు భరించలేక, ఉత్తరాఫ్రికాలోని లిబియాలోనైనా కొంచంవేడిగానున్నచోట తమదాడి సాగించవచ్చునని యెంచి తమ సేనలను అక్కడకు విశేషంగా యిటీవల చేరుస్తున్నారు. మధ్యధరా సముద్రానికి అడ్డంగా కొన్ని నావలమీద జర్మను సేనలనున్నూ, ఆ జర్మను సేనలకు కావలసిన సామగ్రులనున్నూ, ఉత్తరాఫ్రికాకు చేరుస్తున్నారు. ఆ నావలమీదకు బ్రిటిషు విమానాలున్నూ బ్రిటిష్ జలాంతర్గాములున్నూ వెళ్లి టార్పెడోలను ప్రయోగించి వానిలోకొన్ని నావలను మొన్న నీమధ్య నీటముంచివేసినాయి. సముద్రం దాటడం అనేది జర్మనీవాడికి వైతరణి దాటినట్లుగా వుంటోంది. ఎప్పుడూ మెట్టమీది యుద్ధంతోనే మెట్ట వేదాంతంలాగున కాలక్షేపం చెయ్యగలడుగాని సముద్రాలమీదకువచ్చి నావలను నడిపించడం అంటే జర్మనీవాడికి చావు దగ్గరకువస్తుంది. లిబియాలో జర్మనుసేనలు యీ మధ్య కొంతవరకు ముందుకు తోసుకొనివచ్చాయి. కాని ఇంకా గజాలా అనే పట్టణానికి రాలేక జర్మనులు గజగజలాడుతూ ఉన్నారు. ఇంకా వాళ్లకు గజాలా చాలాదూరంలో ఉంది. గజాలా ఇంకా బ్రిటిషువారి వశంలోనేవుంది. ఈ ఎడారిలో యుద్ధం వారూవీరూ ఏడాదినుంచీ చేస్తున్నారు. ఏమీ తేలడంలేదు. ఈ ఎడారిలో యుద్ధం ఆకాశానికి తూటు పొడిచినట్టుగావుంది. జర్మనులు తమ ప్రతాపం అంతా ఇప్పుడు యిక్కడే చూపిస్తున్నారు. పోనీలేండి; యిదీమంచిదే రష్యాలో దెబ్బయిస్తే లిబియాలో చేరుతున్నారు. ఎండలు ముదిరితే యీ ఎడారిలో కూడా గుడారమెత్తుతారు. ఆఖరుకు యీ దుష్టులు ఉభయభ్రష్టులవుతారు.

# బ్రిటిషు టాంకు కర్మాగారం.



తయారగుచున్న ఆయుధ మోటారులు వరుసగ నిలచియున్నవి.

---

# చీనా సర్వ సేనాధికారి ఢిల్లీ చేరుట.

## యుద్ధ తంత్రం గురించి భారత ప్రభుత్వంతో చర్చించుట.

### వైస్రాయి సన్మానము : చాంగ్ కాయిషేకు జవాబు.

చీనా సర్వ సేనాధిపతి జనరలిస్సిమో చియాంగు కాయి షేకుగారున్నూ, వారి భార్యయు, సుమారు 15 మంది చీనా సైన్యపు ఉద్యోగులతోకూడ ఈ వారం 9 వ తేదిన ఢిల్లి వచ్చారు. వారక్కడ రాజప్రతినిధి లిన్‌లిత్‌గో ప్రభువు అతిథులుగ కొన్నాళ్లుంటారు. చీనా - ఇండియాలు కలిసి శత్రువులను యింకా యెక్కువ శక్తి సామర్థ్యాలతో ప్రతిఘటించ గలిగేలాగు చేయడానికి, ఇండియా ప్రభుత్వంవారితోను, ప్రజానాయకులతోను సంప్రదించుటకు వీరు వచ్చేరు. సుమా రొనెల క్రిందట దూర ప్రాచ్యంలో మిత్రమండలి సేనానాయకులైన జనరలు వావెలుగారు చుంగు కింగునకు (చీనా ముఖ్య పట్నం) పోయి యీ విషయమే సంప్రదించియుండిరి. దాని ననుసరించి తరువాత కర్తవ్యం గురించి చర్చించుటకిప్పుడు వీరు స్వయంగా ఇండియాకు వచ్చిరి. వీరిరాక బ్రిటిషు ప్రధాని చర్చిలు అమెరికా పోవుట, విదేశాంగ మంత్రి ఈడెను మాస్కోబోయి స్టాలిన్ని దర్శించుటవంటి ముఖ్యమయినదిగా యెంచబడు చున్నది.

#### స్వాగతం.

వైస్రాయి లిన్‌లిత్‌గో ప్రభువుగారు చాంగ్ కాయి షేకు దంపతులకు తమ భవనములో స్వాగత మొసంగుచు యిట్లా చెప్పారు :— మీకున్నూ మీసతీమణికిన్ని రాజుగారి తరఫున మన స్ఫూర్తిగ స్వాగత మొసంగుచున్నాను. మీరాక వల్ల చరిత్రలో ఒక నూతన ప్రకరణం ప్రారంభ మవుతుందని ప్రజలు భావిస్తారన్న విశ్వాసం నాకు కలుగజేశారు. యుద్ధంలో యీ రెండు గొప్ప దేశాలయొక్క పరస్పర సహాయ సంబంధము యీ సమావేశమువల్ల పూర్తిగా స్థిరపడుతుంది. చీనా-ఇండియా దేశాలలో మొత్తం 85 కోట్ల మంది ప్రజలున్నారు. ప్రపంచమంతటి జనసంఖ్యలో యిది మూడోవంతు. ఈ సమావేశ ఫలితమును త్వరలో అనుభవించగల శత్రువులు, యీ సమావేశము తమకు గొప్ప వినాశహేతు వన్న విషయం త్వరలో తెలుసుకోగలరు. ...........అనేక శతాబ్దలనుండి చీనా-ఇండియా దేశముల ప్రజలకు గల స్నేహసంబంధం మరింత దృఢపరుచుటకే మీరు వచ్చారని మేము తెలుసుకున్నాము. మన రెండు దేశాలకు మధ్య ప్రకృతి సంబంధములగు ప్రబల నిరోధములు న్నను, మానవుల ఆత్మలకు నూతనశక్తి కలిగించ గల నాగరికత, అన్వేషణా పరత్వము, విజ్ఞాన ఆధ్యాత్మిక స్వాతంత్ర నిరతి, మొదలయిన వాటివల్ల, ఆ ప్రకృతి నిరోధములను ప్రజలు అతిక్రమించ కలిగిరి. అనేక శతాబ్దములనుండి యీ రెండు దేశాల మత విజ్ఞాన రాజకీయ విషయములందు ఒకరి ప్రభావ మింకొకరిపై యుండి, వ్యాపిస్తునే యున్నవని చరిత్రవల్ల మనకు తెలియును.

పరమపూజ్యుడైన డాక్టరు సన్ యటు సేను, చీనా ప్రజా ప్రభుత్వ స్థాపకుడు, చైనీయులందరికి అత్యంత విశ్వసనీయుడయిన నాయకుడు. అతని మార్గమునే నేటివరకును చైనీయులందరు దృఢసంకల్పముతో అనుసరించుచుండబట్టే, నేడు మీనాయకత్వమున, జంకుకొంకులేకుండా నాలుగైదేళ్లనుండి కటిక కిరాతులయిన జపానువారిని అతి ప్రసంశనీయముగ నిరోధింపగల్గుచున్నారు.

యుద్ధంలో మీకు మేము తోడుగ మీ చెంత నిలువకముందే చాలా సంవత్సరములనుండి చీనాయోధులుచూపు ధైర్య సాహసములను దీక్షను మేము ప్రసంశిస్తూనేయున్నాము. చీనావారి వీరవిహారము మాకందరికికూడా అత్యధికమైన ప్రోత్సాహం కలుగజేసింది. స్వాతంత్ర్య సమరంలో ఏషియాఖండంలో చీనా దేశమే నాయకమణియని యిటీవల చీనా రాజకీయ నాయకులలో ఒకరన్నారు. ఈ సంగ్రామంలో, ప్రధానములైన బాధ్యతలన్నింటిని నేడు మాకు అతిథులుగనున్న మీరిద్దరు వహిస్తూవున్నారని మాకు బాగా తెలుసు.

#### చీనాకు ఇండియా సహాయం.

చీనావారు మాకు సర్వ విధములా అత్యధికమైన సహాయం యేలాగు చేస్తున్నారో, అలాగే మేము కూడా చీనా వారికి సర్వశక్తులను వినియోగించి సహాయం చేస్తామని నేను వాగ్దానం చేస్తున్నాను. నావి వట్టి మాటలు కావని మీరు నమ్మవలెను. భార

తదేశ హృదయము చీనా దేశహృదయం పూర్తిగా మిళితమయింది అని నేనున్నూ, ప్రభుత్వసంఘ సభ్యులున్నూ మీకు వాగ్దానంచేస్తున్నాము. ఈ సంగ్రామంలో శత్రువులను పూర్తిగా ఓడించుటకు మీతో సమాన భాగస్వాములుగా యిపుడు నిలచియున్న మేము మావంతు బాధ్యతను సరిగా నెరవేర్చుటకు మిక్కిలి గొప్పప్రయత్నం చేస్తాము. మన రెండు దేశాలు కలసి శత్రువులను ప్రతిఘటించుటవల్ల చీనాకు, ఇండియాకు, బ్రిటిషు సామ్రాజ్య దేశాలన్నింటికిని, మిత్రమండలికిని చివరకు అఖండ విజయం అచిరకాలంలోనే తప్పకుండా కలుగుతుంది.

చీనాలో యుద్ధ సన్నాహాలు యింకా చాలా ప్రబలంగా జరిగేటందుకు మీరు నిరంతరం యేర్పాటులను చేయవలసిన తీరికలేని యీ సమయమున మీరు ఇండియాకు వచ్చినందుకు మేము చాల గర్వపడుచున్నాము. ఏడాది క్రిందట మీ పరీక్షల శాఖ అధికారి డా॥ తాయిచిటోవోగారు మా దేశం వచ్చినపుడు, చీనా విశాలమయిన దేశమయినప్పటికి చీనాలో స్త్రీ పురుషులందరు దేశానికిపుడు వచ్చిన ముప్పు తప్పించుటకు ఐకమత్యంతో కార్యదీక్ష పూనియున్నారని అతనిద్వారా వింటిమి. చీనా ఐకమత్యము మహత్తరమైన మణివలె ప్రకాశించుచు, భిన్నాభిప్రాయాలతో చీలిపోవుచున్న ప్రపంచవాసులందరికి ఆదర్శంగానుండి ఉత్సాహం కలిగించగలదని నమ్ముచున్నాము.

భారత ప్రభుత్వ సంఘ సభ్యులతో సంభాషణలు జరుపుటకు మీకు చాలా అవకాశాలేర్పడగలవు. వాటివల్ల మంచి లాభం చేకూరగలదు. చీనా నాయకులకు స్వాగతమిచ్చుటకు ఇండియా గర్వించుచున్నది. ఈ సమావేశమువలన ఇండియా చీనాలకేగాక, ప్రపంచమంతకు అత్యధికమైన మేలు కలుగగలదని మేము నమ్ముచున్నాము.'' అని చెప్పి చీనానుండి వచ్చినవారందరికి వైస్రాయిగారు స్వాగత మొసంగిరి.

### చాంగ్ కాయి షేకుగారు ఎందుకు వచ్చేరో తెలుపుట.

చాంగ్ కాయి షేకుగారు వైస్రాయిగారి స్వాగతమునకు చీనా ప్రజలందరి తరఫున కృతజ్ఞత తెల్పుచు, తమరాక ముఖ్యోద్దేశమునుగూర్చి యిట్లు తెలిపిరి :—

'' చీనా ఇండియా దేశాలవారు కలసి శత్రువులను యింకా చాల అధిక శక్తిసామర్థ్యాలతో ప్రతిఘటించగలిగేలాగు చేయడానికి రాజప్రతినిధితోను, ప్రభుత్వ సంఘసభ్యులతోను, ప్రజానాయక ప్రముఖులతోను స్వయంగా మాట్లాడుటకు మేమిపుడు ఇండియాకు వచ్చియున్నాము.''

ఈ రెండు దేశాలకు అనేక శతాబ్దములనుండి ఆధ్యాత్మిక విషయములలో దృఢతమమైన సంబంధం ఏర్పడియున్నదనియు, అతి ప్రాచీన కాలంలోనే భారతదేశంలో తత్వశాస్త్రపఠనకై అనేక కష్టములకోర్చి నిర్గమప్రదేశాలను దాటిగూడ చైనీయులు భారతదేశానికి వచ్చియున్నారనియు, ఇండియానుండి గ్రంథాలను చీనాకు తెచ్చిరనియు తెలిపిరి. ఈ రెండు దేశాల వైజ్ఞానిక సంబంధము దృఢమయినది కాబట్టే జపాన్ను చీనా ప్రతిఘటిస్తున్నపుడు, భారతదేశంలోని సమస్త ప్రజలున్నూ అత్యధికమైన సానుభూతి చూపిరనిరి. జపాను యీ సానుభూతిలేకుండా చేసి, తనవైపు మరల్చుకోవాలని చూసింది, కాని ఇండియా మోసపోలేదు. జపాను అపవిత్రమైన స్నేహసూచనలు చేసినపుడు, రక్తశిక్తమగు చేతితో స్నేహం వాంఛించునపుడు, జపానుపై భారతీయులకు తీవ్రతమమైన ఆగ్రహంకలిగిందని అపుడు జగద్విఖ్యాతుడైన కవీంద్రుడు రవీంద్రనాథ టాగూరు గంభీరవాక్యములతో లోకమునకు వెల్లడిచేసెననిరి.

'' ఇపుడు జపాను, బ్రిటను అమెరికా దేశాల మీదకూడా యుద్ధం ప్రకటించుటవల్ల యుద్ధము దక్షిణ పశిఫికు మహాసముద్రమునకుగూడ వ్యాపించింది. అందు ఇండియాపై జపానుదాడికి అవకాశంగలదు. జపానువారు బర్మా మీదుగనే ఇండియాకు చేరవలసియున్నది. నెల క్రిందట సర్ ఆర్చిబాల్డు వావెలుగారు చుంకింగు వచ్చినపుడు బర్మాద్వారా ఇండియాకుగల ముప్పునుగూర్చి కూడా మేము చర్చించియుంటిమి. బర్మా రక్షణకు చీనా సేనలను పంపేయేర్పాటు అపుడే అమలు జరిగింది.

'' చీనా అనుభవము, అంగబలం ఉపయోగించుకొని, భూమి మార్గమున ఇండియాకు శత్రుదాడి రాకుండా ఉభయులంకలసి ప్రథమయత్నం చేసియున్నాము. ఉత్తరమున, తూర్పున చీనా ఇండియాకు రక్షగనున్నది. అందుకు చీనా గర్వించుచున్నది.

'' నేడు స్వాతంత్ర్యంకొరకు జరుగుచున్న యుద్ధంలో రక్షణకు మొట్టమొదట కత్తిదూసినది చీనాయేనని మీ రిపుడు చెప్పియున్నారు. ఆమాట నిజమేగాని, గత నాలుగున్నర ఏండ్లలో యీ ఆక్రమాన్ని నిరోధించడంలో మాకు బ్రిటిషు ప్రభుత్వము, బ్రిటిషు సామ్రాజ్య ప్రజలున్నూ నైతికంగాను భౌతికంగాను సహాయంచేసియున్నారు. చీనా సైన్యం, చీనా ప్రజల తరఫున బ్రిటిషురాజుగారి ప్రతినిధియగు మీ కిపుడు అందుకు కృతజ్ఞత తెల్పుచున్నాను.

'' ఇపుడు మనమందరం యుద్ధంలో భాగస్వాములుగా భుజం కలిపియున్నాము ; శత్రువును ఓడించుటకు దీక్ష పూనియున్నాము. విజ్ఞానవిధులైన తమ నాయకత్వము మన కెంతో సహాయకారిగనుండగలదు. నా పైపడిన భాధిక బాధ్యతను నేను గుర్తించియున్నాను. శత్రువును పూర్తిగ ఓడించి, ప్రజాప్రభుత్వ సిద్ధాంతమునకు అఖండ విజయము చేకూర్చుటయందు, ఘనమైన మా మిత్రదేశమునకు, పూర్తిగ స్నేహభావంతో తోడ్పడెదమని వాగ్దానం చేయుచున్నాను.''

అని మాటలు చాంగ్ కాయి షేకుగారు చెప్పిముగించిరి. తరువాత రాజప్రతినిధి దంపతులు వారి బసకువెళ్లి పలకరించివచ్చిరి.

---

## జర్మనీ అధికారంలోనున్న ఇటలీ.

## ముసోలినీవెంట జర్మను గూఢచారులు.

### దేశంలో తిండిలేదు

### పంటలన్నీ జర్మనీకి పోవలసిందే

### ఇటలీకి జర్మనీ ఆక్రమించిన దేశాలగతిపట్టింది.

1940 వ సం॥ జూలై 10 వ తేదిన ఇటలీ యుద్ధములో దిగినపుడు ముసోలిని తన కోట డాబాపై నిలచి, రోమ్మువిరచి '' మారరాని నిర్ణయము చేయుటకు సమయం వచ్చింది '' అని ప్రకటించినపుడు, ఆ నాటి నిర్ణయములు నిజంగా మారజాలనివేయని తెలుసుకొనియుండడు. అతని ఫాసిష్టు పార్టీ యుద్ధం త్వరలో ముగిసి జయం చేకూరుతుందనుకున్నది. ఫ్రాంసు జర్మనీకి సాష్టాంగపడియున్నపుడు, మధ్యధరా సముద్రంలో బ్రిటిషు నౌకాదళం శక్తి కొంచెం తగ్గియున్నపుడు ఇటలీ యుద్ధంలోదిగి ఆఫ్రికాపై దాడి ప్రారంభించింది. ఈజిప్టు నాక్రమించి సోమలీలాండునుండి బ్రిటిషు వారిని తరిమేయాలనుకొంది. ఆల్బేనియాలో తనకధికారం ఉండబట్టి ఆ ప్రక్కనున్న గ్రీసును సులభంగా కబళించవచ్చని ఇటలీ అనుకుంది. తిరిగి రోమను సామ్రాజ్యం స్థాపిస్తానని ముసోలిని ఆశపడ్డాడు. కాని బాల్కను రాజ్యాలందు, ఆఫ్రికా పడమర ఎడారియందుగూడ అతని ఆటలు సాగలేదు. గ్రీసు లిబియాలలో ఓటమి, అబిసీనియా పోవడం, ఇరిట్రియా, సోమలీలాండుగూడ తాను గోల్పోవడంచేత ఇటలీ జర్మనీకి బానిసకావలసి వచ్చింది. పైగా టోరెంటో, మటపములందు బ్రిటిషు నౌకాదళం ఇటలీ యుద్ధనౌకలను పిప్పిచేసినది. అందుచే ఇటలీ తలఎత్తలేకపోయింది.

ఇటలీ అవమానం పూర్తియై క్రిందపడితేకాని హిట్లరు తన మిత్రుడగు ముసోలినికి కించిత్తయిన సహాయంచేయలేదు. ఈ ఓటమివలన ప్రజలాశ్చర్యపోయిరి. ఈ దౌర్భాగ్యమునందు వారికి దారి తెన్ను తోచలేదు. అంతట జర్మనీనుండి రహస్య పోలీసు సిబ్బంది, జర్మను ఏజంటులు ఇటలీలో ప్రవేశించిరి. పరిపాలించేయిచ్చగలవారు వారే గనుక అధికారం వారిచేతులకు మారింది. ఫాసిష్టు ప్రభుత్వోద్యోగులు ఒండొరులపై తప్పులెన్నుకొం

టూవుండడంచేత, పార్టీకిన్నీ సైన్యానికి విభేదాలెక్కువైనవి. జర్మను రహశ్య పోలీసుదళంవారు చల్ల చల్లగ ఇటలీ ప్రభుత్వాధికారం, ఉన్నతోద్యోగాలు తీసుకోడం ప్రారంభించిరి. ప్రజలకు తాను విరోధినవుతున్నానని తెలుసుకొన్న ముసోలిని నియంత, తన అధికారం నిలిపియుంచుటకు తోడ్పడ బాసచేసిన జర్మనులకే అధికారపదవులు విడచిపెట్టక తప్పిందికాదు.

మార్షలు బొడోగ్లియో మున్నగు సేనానాయకులు ఉద్యోగములనుండి తొలగింపబడిరి. ముఖ్యమగు మంత్రులందరును, ముసోలినిగారి అల్లుడగు కవుంటుకియానో విదేశాంగమంత్రికూడా సైన్యంలో చేరి చాకిరీచేయవలసివచ్చింది. అందుచే, జర్మను అధికారాన్ని కాదనగల పెద్దలెవ్వరు యిక ప్రభుత్వంలో లేరు. నాజీ ప్రభుత్వరాయబారియగు వానుయకెను సెనుగారు ఇటలీ మంత్రివర్గ సమావేశములన్నిటికి హాజరగును. ఫాసిస్టు దిగువ ఉద్యోగులందరిని, యువకులను జర్మనుగూఢచారి దళంవారు తరిమివేస్తూవుంటే యీ మంత్రివర్గం చూస్తూవూరుకుంటూవుంటుంది. ఆయువకవర్గమంతా ఇటలీ దేశభక్తులున్నూ జర్మను ప్రతికూలురున్నూ. టెలిఫోను, టెలిగ్రాఫ్, ఎలక్ట్రికు సర్వీసులన్నింటియందు రోమునగరంలో నాజీ జర్మనులే పనులు చేయుచున్నారు. ఇటాలియను రైల్వేలందు, నేపిల్సు, జినోవా ముఖ్య నగరాలందు బ్యాంకులు పోస్టాఫీసులందు జర్మనులేయున్నట్లు వదంతులు గలవు. రేడియో ప్రచారం అంతా జర్మనుల సలహాననుసరించి జరుగును. ఫిల్ము పరిశ్రమకు, వార్తా పత్రికలకు జర్మను 'సలహాదారు' లనబడు అధికారులున్నారు. జర్మను పోలీసులకు వలస రాజ్యాలేలే అనుభవం రోమునగరంలో లభించుచున్నది. ఇదంతా కాక, అసలు సిసలు జర్మను సైన్యం 2½ లక్షలు నేపిల్సు, బారి మున్నగు నౌకా కేంద్రములందుండనేయుంది. జర్మనీ ఒత్తిడికి ఇటలీ లొంగకపోతే యీ సైన్యం పనిచేస్తుంది. కర్మాగారాలన్నింటికి పనివారు, యిరువైపుల జర్మను సిపాయిల మరఫిరంగుల మధ్యనుండి వెళ్లాలి.

### పంటలు తీసుకొనుట.

రాజకీయంగాను, సైనికంగాను ఇటలీ పీకనులిపినతరువాత, ఇటలీలోని పంటలన్నీ పీకుకోవాలనియే హిట్లరు యుద్దేశము. 1940 వ సంవత్సరంలో జరిగిన వ్యవసాయ ఒడంబడికలోసరిగా జర్మనీ ఆక్రమించిన దేశాలపై విధించిన షరతులన్నీ ఇటలీపై విధించింది. ఈ ఒడంబడిక ప్రకారం పండ్లు, పచ్చికాయగూరలు, పాదరసం, గంధకం, జనుమునార, ముడిప్రత్తి జర్మనీకి ఇటలీ ఎగుమతి చేయాలి. ఇటలీనుండి కార్మికులను గూడ జర్మనీ తన దేశానికి తీసుకపోవుటచేత, ఇటలీలో మిగిలిన కార్మికులు రాత్రిం పగళ్లు పనిచేయవలసి వస్తున్నది

ఆహారపదార్థముల స్థితి మరీ అధ్వాన్నంగా వుంది. కార్మికులస్థితి అధోగతియైంది. ఇటలీ ప్రజలు సాధారణంగా ఎక్కువ బ్రెడు (రొట్టె) బార్లీగుజ్జు, సారాయిపై బ్రతుకుతారు. పాటకజనం చాల తక్కువ మాంసం తింటారు. ఇపుడు బ్రెడు మంచిది దొరకడం లేదు తిన వీలులేని అసహ్యపుసరుకు దొరుకుచున్నది. బార్లీగుజ్జు నల్లగను రుచి లేకుండాను ఉంటుంది. వెన్న చాలకాలంనుండి కనబడలేదు. వారానికోరోజు మాంసం యిస్తారు, అదేనా అదృష్టంవున్నవారికే లభిస్తుంది, ఇంతాచేస్తే అది గుర్రపుమాంసం. చేపలు చాలతక్కువ. వంసత వేసంగి కాలాలలో పండ్లు దొరకవు. కాఫీవాసనే కొన్ని నెలలనుండి ఇటలీవారు ఎరుగరు. నూనెలు, క్రొవ్వుపదార్థములన్నీ జర్మనీ తీసుకొంటుంది; గతయేడు నారింజ, నిమ్మపంట అంతా తీసుకుంది. ఈ యేటిపంట చెడిపోయింది. దాన్ని పురుగునుండి సంరక్షించుటకు తగినమందులు ఇటలీలో లేవు. ద్రాక్షతోటలగతి అంతే. ఇటలీలో యిదివరకెన్నడూలేని సారాయి రేషనింగు (కొలత ప్రకారం యివ్వడం) జరుగుచున్నది.

ఇట్లావుంటే ఇటలీలో ప్రజలు అసంతృప్తిచెంది తిరుగబడడంలో ఆశ్చర్యమేమిగలదు. సిసిలీదీవియందున మాఫియాయను రహశ్య సంఘమును ముసోలిని అణచలేకుండెను. అది యిపుడు కుట్రలు పన్నుచున్నది. అయితే ఇటలీ ప్రజలు చాల ఓర్పుగలవారు కనుక అసంతృప్తి పైకుబుకదు. అప్పుడపుడుమాత్రం పైకి పొక్కుతూవుంటుంది. గత సెప్టంబరులో మిలాను నగరంలో మూడు పెద్ద సెల్లులోను కర్మాగారాలు కాల్చివేయబడినవి. రైళ్లు పడగొట్టబడినవి. జినోవాలో పెట్రోలు, గోధుమ గిడ్డంగులు తగులపెట్టబడినవి. ట్రియస్టా నగరంలో మందుగుండులు, నౌకారేవులు నాశనం చేయబడినవి. సాధారణంగా ధాటీగా పచారు చేయు ముసోలినియే, యిపుడు తనభవనంలో ఒంటరిగా గొణుగుకొనుచుండును; వందలకొలది రహశ్యపు జర్మను పోలీసులు అతన్ని కాపలా కాస్తువుంటారు. డిశంబరులో అతన్ని చంపదలచినట్టియు, జాతీయవిరుద్ధ కార్యములు చేయుచున్నారనునట్టియు నేరములకై ట్రియస్టాలో 71 మంది విచారణ చేయబడిరి. వారిలో అన్ని పార్టీలవారు గలరు.

ముసోలినికిగాని, రాజవంశంవారికిగాని ఏమి జరిగినా జరక్కపోయినా, తమ పనై పోయిందని ఇటలీప్రజలను కొనుచున్నారు. కొంద రింకా జర్మనీ గెలుస్తుందనో లేక అనుకూలమగుసంధి చేసుకొంటుందనో నమ్ముచున్నారు. కాని అపుడైనా వారుగూడ మిత్రదేశమగు జర్మనీకి ఇటలీబానిసగానుండకతప్పదని వారికే బాగా తెలుసు. చాలమంది ఇటలీవారు ఇంగ్లాండే గెలుస్తుందనుకుంటున్నారు. అయితే, అపుడైనా వారి స్వాతంత్ర్యము, వారి స్వదేశం భద్రంగా వుంటాయిగాని, అన్యాయంగా ఆక్రమించిన సామ్రాజ్యం మాత్రం, వారికి తిరిగి లభించదు. అదివరకు ఇటలీ క్రిందనుండిన ఇతోఫియా చక్రవర్తికి బ్రిటిషు ప్రభుత్వానికి గతవారం జరిగిన ఒడంబడికయే యిందుకు నిదర్శనం.

---

# హిట్లరు కాకసస్సుపై దాడి తలపెట్టెనా?

## రష్యాకు సహాయం అవసరం.

## సర్ స్టాఫర్డు క్రిప్సుగారి హెచ్చరిక.

యూరోపులో యిపుడు జర్మనీ రష్యాల మధ్య జరుగుచున్న యుద్ధమునందు రెండు పక్షాలవారి స్థితిని గురించి జర్మనులు చలికాలం పోయినాక యేమిచేయనున్నదిన్ని తెలిసికొనుట మంచిది. ఇంతవరకు జరిగిన యుద్ధంలో రెండు దేశాలకు చాల సైన్యము యుద్ధసామగ్రి నష్టమయింది. హిట్లరు తానాక్రమించిన దేశాలలో కార్మికులను బానిసలవలె చూస్తు పనిచేయించి నష్టపోయినవన్ని తిరిగి చేయించి పూర్తి చేసుకుంటున్నాడు. చేలాంగిన యూరోపు దేశాలలో కూలికి సైన్యం తయారుచేసి పంపించమని ఒత్తిడి చేస్తున్నాడు. కావున వసంతకాలం వచ్చే సరికి, అతనికి, రష్యాపై యుద్ధం ప్రారంభించినపుడెంత సైన్యం, ఎంత సైనిక సామగ్రి మందుగుండు ఆయుధాలు ఉండెనో అదంతా యుండవచ్చును. కాని అప్పటికీ యిప్పటికి ఒక్క వ్యత్యాసం గలదు. అతివడిగా పనిచేసే అతని "క్రాకు ట్రూప్సు"లో చాల భాగం గోల్పోయినందున అతని సేనకు సమర్థత తగ్గియుంటుంది.

రష్యాలో అనేక పరిశ్రమ కేంద్రాలు చెడిపోయినాయి. ఆనష్టానికి సరిపోవునట్లు తూర్పున ఉత్పత్తి స్థానాలలో కొంత ఉత్పత్తి యెక్కువచేసుకొనెను. అంగ బలంలో రష్యా జన సంఖ్యయే జర్మనీకన్న యెక్కువ. రష్యా ప్రజల ధైర్యం ఉన్నతస్థితిలోనుంచి, రష్యనులు తమ స్వంతయిండ్లు, వాకిళ్లు స్వదేశమును కాపాడుటకు పోరాడుచున్నాంకదాయను ఉత్సాహంతో ధైర్యంతో ఉక్కుపట్టుదలతో ఎక్కువ శక్తివంతంగా పోరగలరు. జర్మనీకి సేన చాలవరకు డబ్బుపై ఆధారపడియున్నదే.

హిట్లరుకి యింకో చిక్కుగలదు. తగినంత చమురు అతనికిలేదు. కొంత సరకుందిగాని, అది దీర్ఘకాలం యుద్ధానికి చాలదు. కావున అతడు రష్యా దక్షిణ భాగమునందున్న కాకసను ఆక్రమించ తొందరపడుచున్నాడు. వచ్చే వసంతకాలమున బాకుచమురు గనుల నాక్రమించుటకై అతడు తీవ్రమయిన దాడి కాకససుపై ప్రారంభించునని సైనిక నిపుణులు పలువురనుకొనుచున్నారు. ఇందువలన రష్యాలో ఉత్తర మధ్యరంగములందు కొంత జర్మను ఒత్తిడి తగ్గవచ్చును. కాని అంతమాత్రమున రష్యా విమరియుండరాదు. రష్యా అన్ని రంగాలలో శత్రువును ఎదుర్కొనుటకు వీలుగనుండుటకై రష్యా నియంత స్టాలినుకి, తన కర్మాగారములందు తయారగు సరకు చాలక, మిత్రమండలిపంపే ఆయుధాలు ముడిపదార్థాలు అన్నింటి సహాయం కావాలి,

### సర్ స్టాఫర్డు క్రిప్సుగారి సందేశం.

మాస్కోలో బ్రిటిషు రాయబారిగానుండిన సర్ స్టాఫర్డు క్రిప్సుగారు, యీ విషయం మాస్కోనుండి ఇంగ్లాండునకు తిరిగివచ్చినప్పటినుండి నొక్కి చెపుతున్నారు. హిట్లరు చిట్టచివరకు ఓడిపోతాడు. ఆ ఓటమి ఆలశ్యంగావచ్చును. ఈలోగా అతడు వసంత ఋతువులో కాకససులోని చమురుగనులాక్రమించుటకు తీవ్రమైన దాడి జరుపుటకు శక్తి సంపాదించగలడని సర్ క్రిప్సుగారు బ్రిటిషు ప్రజలకు హెచ్చరికగ దెలిపిరి. ఆ మార్గాన హిట్లరు తనశక్తినంతా వినియోగించి, తిరిగి యొక మెరుపుయుద్ధం చేస్తాడని ఆతనియుద్దేశము. కావున ఇంగ్లాండు-అమెరికాలు యిపుడు యెక్కువ సహాయం పంపవాలి. ఎక్కువ శ్రమపడనవసరం లేదు, రష్యా ఒంటరిగనే జర్మనీని ఓడించగలదని బ్రిటిషు ప్రజలనుకోడం పొరపాటని వారు హెచ్చరించిరి. రష్యా చాల నష్టపోయింది కనుక మందుగుండు, విమానాలు, టాంకులు, ముడిపదార్థాలు, తినుబడి సామానులు స్టాలిను ఎంత కోరితే అంత పంపించాలి. అట్లా పంపితే వచ్చే యేడు యీ సరికి జర్మనీ ఓడిపోవుటకవకాశముండునని క్రిప్సుగారు తెలిపిరి. బ్రిటిషు ప్రజలు ఫరవాలేదనే ధీమాతోనుండి, తొందరపడలేదని

తనకు తోచబట్టి యిట్లు చెప్పుచున్నాననికూడ క్రిప్సుగారనిరి. రష్యా ప్రజల తత్వమును, రష్యా యవసరములను బాగా తెలిసి అక్కడనుండి వచ్చిన వారు చేయుచున్న హెచ్చరిక గనుక, దీనికి ఫలముండకపోదు. ఇంగ్లాండు యీ విషయం గుర్తించినట్లే చిహ్నములగుపడుచున్నాయి.

### అమెరికా కృషి.

రష్యాకు సహాయం చేయడం విషయము అమెరికా సహకారం పై నాధారపడియుండును. ఇపుడు అమెరికాకే దెబ్బ తగిలినందునను, ప్రాచ్యమునం దోడుచుండుటచేతను, ఆత్మవిమర్శ జరుగకమానదు. ఉత్పత్తి కార్యవర్గాలన్నింటిలో అవసరమగు మార్పులను చేయుచు అధ్యక్షుడుత్తరువు చేసెను. యుద్ధ ఉత్పత్తి సంఘం అధ్యక్షులుగ డోనాల్డు నెల్సనుగారు నియమింపబడిరి. వారికి ఉత్పత్తి సప్లై వ్యవహారములు బాగా తెలియుచు, మంచి శక్తి సామర్థ్యములు కలవు. 53 సం॥ల ఆరోగ్యవంతుడు, పైపుచుట్ట త్రాగుచు ఉత్సాహంగానుండే మధ్యరాష్ట్రపు వ్యాపారస్తుడని అతనిగూర్చి చెప్పుకుంటారు. పట్టుదలగలవాడని, సమర్థుడని అమెరికనులందరిలో ప్రతీతి.

ఇంగ్లాండు-అమెరికా యుద్ధ ప్రయత్నాలు కలిసి చేయుటకు, అన్యోన్య సహకార పద్ధతులు ఆలోచింపబడినవి. మందుగుండు వాటాలు, నౌకల యేర్పాటులు, ముడివస్తువులు—యీ మూడింటికి మూడు సమిష్టి సంఘములు స్థాపించబడినవి. సేనా నాయకుల సమిష్టి సంఘముల వలనే యివికూడ కలిసి పనిచేయుచు, రెండు దేశాల ఉత్పత్తి కార్యములు ఒక దానికొకటి తోడ్పడునట్లు చూచుచుండును. యుద్ధ ప్రయత్నములందు యిటీవల వివిధ దేశముల సహకారము స్థిరరూపము దాల్చెను.

## భారతీయ ఫిరంగి దళం.

### మలయాలో చూపిన కార్యదీక్ష.

మలయాలో యిటీవల జరిగిన శత్రు విమాన దాడియందు విమానాలను కూల్చే ఫిరంగిదళమునకు చెందిన ఒక జట్టువారు చూపిన ధైర్యసాహసములు, కార్యదీక్షను వారి సేనానాయకుడు ప్రశంసించుచు యీదిగువ రీతి వర్ణించెను. ఇది తాను స్వయంగా చూచెను కాని భారతీయ సైనికుల యిట్టి సాహసకృత్యములు అనుదినము ఎన్నో ఎవరు చూడకుండనే జరిగిపోవుచున్నవని అతడనెను :—

విమానదాడి వచ్చిందనగానే తమ ఫిరంగిని సరిచేసి ఎంతవడిగ ప్రేలుస్తామా అనే ఆదుర్దా యీ దళంవారందరికీ గలదు. తమ హవల్దారు చెప్పినట్లు అందరు విని శ్రద్ధగ పనిచేయుదురు కనుక ఎటువంటి గాభరా కాని పొరబాటుగాని యుండదు.

ఒకనాడు రాత్రి 11 గంటలకు విమానదాడి హెచ్చరిక చేయబడెను. నేను నాబండినెక్కి యీ ఫిరంగి ఉన్నచోటికి పోతిని. హెచ్చరిక చేయబడగానే విమానాల మ్రోత వినబడెను. నేను భారతీయ సైనికుల ఫిరంగికి 20 గజముల దూరం వరకువచ్చి చేరితిని. వెంటనే పని ప్రారంభమయినది, నేనంతయు చూచుచుంటిని. పైన విమానం కనబడగనే, ఫిరంగి మూతి దానిపై గురి చేయబడెను. ఇంతలో దానిచెంతనే ఒక "ఆంటి పెర్సనలు" బాంబుపడెను. బలవీర శింగు, నెం. ఎ. ఎ. 5122 గన్నరు, ఫిరంగి దగ్గరగ నిలచియుండెను. అతనికి తొడలో గాయమయ్యెను. అతను చేతిలో మందు తోటాలు ఫిరంగి ప్రేల్చేవాని కందిచ్చుటకు సిద్ధముగ పట్టుకొనియుండెను. అతని ఒక కాలు నిరుపయోగమయి పడిపోయెను. కాని చేతిలోనున్న తోటాలను ఎత్తి పట్టుకొనియే ఫిరంగిచెంతకు ప్రాకిపోవ ప్రయత్నించుచుండెను. మరి యిరువురు గూడ చాల గాయపడిరి. ఇంతలో మరొకడు పై యజమాని ఉత్తరువులకు ఎదురు చూడకుండానే, ఫిరంగి ప్రేల్చే స్థానంలోని కురికి కూర్చొనెను. వేరొకడు గుండ్లు అందిచ్చేచోట నిలచి సహాయం చేయుచుండెను.

ఇంతలో పక్కనున్న గడ్డికి నిప్పంటుకొనెను. ఆ మంటలు మందుగుండున్న పెట్టెలవద్ద కెగ ప్రాకుచుండెను. ఆ మంటలార్పమని నే సుత్తరువు చేసితిని. ఒకడు తన ఉక్కు టోపీతోనే ఒక కర్ర పెట్టెనంటుకుంటున్న మంటలార్పి దానిని భద్రపరచెను. ఈ పనికాగానే తిరిగి ఫిరంగి వద్దకుపోయి సిద్ధముగానుండెను. టెలిఫోనులో మాట్లాడేవాడు, క్రింద మంటలార్పుచు, వాటిపై నుండి కుప్పిగంతుల వేయుచునే తలపై టెలిఫోను యంత్రం చెవులకు తగిలించుకొని పని చేయుచుండెను.

గాయపడినవారి సంగతి మరీ అద్భుతంగా నుంది. వారిలో ఒక్కడైనా దెబ్బతగిలినట్లు ఫిర్యాదు చేయడంగాని, సహాయం కోరడంకాని చేయలేదు. అంతా "బిల్‌కులుఠీక్" అంటూ జవాబు చెప్పడంవలన ఎవరికెంత దెబ్బ తగిలిందో తెలుసుకోడం కష్టమయింది. ఒకనికి విశ్రాంతి తీసుకోమని ఉత్తరువుచేస్తే, ఉత్తరువులనుల్లంఘించి, తిరిగి ఫిరంగివద్దకు వచ్చెను.

ఈ జట్టుకిచెందిన హవిల్దారు పాములాలునకు, గన్నరు బలవీరశింగుకు ఐ.డి.ఎస్. మెడల్సు ఒసంగబడెను. ఈ దళానికి చెందిన అందరు సైనికులు మెడల్సు పొందదగినవారే అయినా అందరికి యిచ్చుటకు వీలులేదు.

## సైన్యానికి చిల్లర సామానులు.

### ఇండియానుండి విశేషముగా కొనుట మరికొన్ని క్రొత్త సరకులు తయారుచేయుట.

7,000 లక్షల ఇనుప గుండీలు, 400 లక్షల అగ్గిపెట్టెలు, 380 లక్షల రబ్బరు గుండీలు, 200 లక్షల పౌనుల సబ్బు, 185 లక్షల హుక్కులు రింగులు, 85 లక్షల పౌనుల పెయింటు రంగు, 80 లక్షల చెవి కవచాలు, 50 లక్షల చదరపు అడుగుల కంపుల రేకు, 30 లక్షల సీసా మూతలు, 30 లక్షల ఇత్తడి రింగులు, 25 లక్షల చాకులు, సుమారు 10 లక్షల కప్పులు, సాసర్లు, ప్లేట్లు అనేకం గుర్తు బిళ్లలు, కార్డులు, గ్యాసు ప్రాణవాయువు, అంబులెన్సు మోత మంచాలు, కత్తెరలు, చమురు డబ్బాలు, ఉక్కు బ్రషులు, లక్క, లోహం పాలిషు, సిమెంటు, మున్నగు వస్తువులు ఎన్నో సప్లై శాఖవారి మిసలేనియను స్టోర్సు డైరెక్టొరేటువారు, యిటీవల కొన్ని వారాల నుండి ఇండియాలో తయారు చేయించుచున్నారు.

నవంబరు, డిసంబరు మాసములందు యీ డైరెక్టరేటు వారికి 700 పెద్ద ఆర్డరులు వచ్చినవి. ఇందులో నాలుగోవంతు విదేశాలకు పంపుట కొరకే. వీటి సంఖ్యలు, రకాలను గమనిస్తే, ఎన్ని విపరీతమయిన వస్తువులు ఎంత ఎక్కువగా యీ దేశంలో తయారవుతున్నాయో తెలియగలదు. 1,000 రకాలు యీ డైరెక్టరేటు ద్వారా పోతున్నాయి.

గత కొద్ది మాసాలలో ఇండియాలో తయారు చేయించిన క్రొత్త సామాను లేమనగా : కుట్టుపని యంత్రాలు, బైసికిల్సు, వాటి భాగాలు, పాలుపిండే యంత్రాలు, అట్టపెట్టెలు, ప్లైవుడు పెట్టెలు, పండ్లు తోమే బ్రషులు, అద్దం బదులు అటువంటి వస్తువు, జీలుగు బెండ సామానులు, కర్ర పూలు ఇంసు లేటింగు బోర్డు, సూదులు, మైనం, రబ్బరు గొట్టాలు, రబ్బరు గాలి తిత్తులు, మంచు సంచులు, వేడినీటి సంచులు, రబ్బరు వాషరులు, పారాషూటులు పడవేసే పెట్టెలు, చెడువాయువు కనిపెట్టె సాధనాలు.

సైన్యానికి కావలసినటువంటి దువ్వెనలు సాలీనా 2,500,000 వరకు ఇండియాలో తయారు చేయబడుచున్నవి.

## జపాను బాంబులు.

జపాను విమానాలు "ఆంటి పెర్సనలు" బాంబులనుపయోగిస్తున్నాయి. అంటే వ్యక్తికి హాని కలుగజేసేవని అర్థం. ఈ బాంబులు సైనిక శిబిరాలనుగాని, భవనాలనుగాని పాడుచేయడానికి పనికి రావు. ఈ బాంబు ప్రేలేచోట మనుష్యులు గోతిలోగాని, గోడ చాటునగాని దాగుంటే ఏమీ చేయవు. ఆరు బయట మనిషి వుంటే చాల అపాయం. మనుష్యులు గుమిగూడియున్నచోట యిదిపడితే భీభత్సం కలుగజేయును. ఈ బాంబు నేలను 2 అడుగుల గోయిమాత్రం కలుగజేయును. తునకలు కిరణాల వలె పైకెగిరి ప్రక్కనున్న మనుష్యుల నడుముల వరకు తగులును.

రంగూనులో యీ "ఆంటి పెర్సనలు" బాంబులవలన ఏ భవనము చెడిపోలేదు. ఈ బాంబులతో దాడి జరిగినపుడు మనుష్యులు దాగోడం చాల అవసరం.

### సవరణ.

ఫిబ్రవరి 6 వ తేది యుద్ధసంచికలో ఆఖరు పేజీయందు సైన్య విభాగములు అను వ్యాసంలో డివిజనులో సుమారు 12,000 సైనికులుంటారు అనుటకు బదులు 1,200 అని పొరబాటున ప్రకటింపబడినది. పాఠకులు సవరించి చదువుకొన ప్రార్థన.

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.

తనకు తోచబట్టి యిట్లు చెప్పుచున్నాననికూడ క్రిప్సుగారనిరి. రష్యా ప్రజల తత్వమును, రష్యా యవసరములను బాగాతెలిసి అక్కడనుండి వచ్చిన వారు చేయుచున్న హెచ్చరిక గనుక, దీనికి ఫల ముండకపోదు. ఇంగ్లాండు యీ విషయం గుర్తించినట్లే చిహ్నాలగుపడుచున్నాయి.

### అమెరికా కృషి.

రష్యాకు సహాయం చేయడం విషయము అమెరికా సహకారం పై నాధారపడియుండును. ఇప్పుడు అమెరికాకే దెబ్బ తగిలినందునను, దూర ప్రాచ్యమునం దోడుచుండుటచేతను, ఆత్మవిమర్శ జరుగకమానదు. ఉత్పత్తి కార్యవర్గాలన్నింటిలో అవసరమగు మార్పులను చేయుచు అధ్యక్షుడుత్తరువు చేసెను. యుద్ధ ఉత్పత్తి సంఘం అధ్యక్షులుగ డోనాల్డు నెల్సనుగారు నియమింపబడిరి. వారికి ఉత్పత్తి సప్లై వ్యవహారములు బాగా తెలియుచు, మంచి శక్తి సామర్థ్యములు కలవు. 53 సం॥ల ఆరోగ్యవంతుడు, పైపుచుట్ట త్రాగుచు ఉత్సాహంగానుండే మధ్యరాష్ట్రపు వ్యాపారస్తుడని అతనిగూర్చి చెప్పుకుంటారు. పట్టుదలగలవాడని, సమర్థుడని అమెరికనులందరిలో ప్రతీతి.

ఇంగ్లాండు-అమెరికా యుద్ధ ప్రయత్నాలు కలసి చేయుటకు, అన్యోన్య సహకార పద్ధతులు ఆలోచింపబడినవి. మందుగుండు వాటాలు, నౌకల యేర్పాటులు, ముడివస్తువులు—యీ మూటింటికి మూడు సమిష్టి సంఘములు స్థాపించబడినవి. సేనా నాయకుల సమిష్టి సంఘముల వలెనే యివికూడ కలిసి పనిచేయుచు, రెండు దేశాల ఉత్పత్తి కార్యములు ఒక దానికొకటి తోడ్పడునట్లు చూచుచుండును. యుద్ధ ప్రయత్నములందు యిటీవల వివిధ దేశముల సహకారము స్థిరరూపము దాల్చెను.

## భారతీయ ఫిరంగి దళం.

### మలయాలో చూపిన కార్యదీక్ష.

మలయాలో యిటీవల జరిగిన శత్రు విమాన దాడియందు విమానాలను కూల్చే ఫిరంగిదళమునకు చెందిన ఒక జట్టువారు చూపిన ధైర్యసాహసములు, కార్యదీక్షను వారి సేనానాయకుడు ప్రశంసించుచు యీ దిగువ రీతి వర్ణించెను. ఇది తాను స్వయంగా చూచెను కాని భారతీయ సైనికుల యిట్టి సాహసకృత్యములు అనుదినము ఎన్నో ఎవరు చూడకుండనే జరిగిపోవుచున్నవని అతడనెను :—

విమానదాడి వచ్చిందనగానే తమ ఫిరంగిని సరిచేసి ఎంతవడిగ ప్రేలుస్తామో అనే ఆదుర్దా యీ దళంవారందరికి గలదు. తమ హవల్దారు చెప్పినట్లు అందరు విని శ్రద్ధగ పనిచేయుదురు కనుక ఎటువంటి గాభరా కాని పొరబాటు గాని యుండదు.

ఒకనాడు రాత్రి 11 గంటలకు విమానదాడి హెచ్చరిక చేయబడెను. నేను నాబండినెక్కి యీ ఫిరంగి ఉన్నచోటికి పోతిని. హెచ్చరిక చేయబడగానే విమానాల మ్రోత వినబడెను. నేను భారతీయ సైనికుల ఫిరంగికి 20 గజముల దూరం వరకువచ్చి చేరితిని. వెంటనే పని ప్రారంభమయినది, నేనంతయు చూచుచుంటిని. పైన విమానం కనబడగనే, ఫిరంగి మూతి దానిపై గురి చేయబడెను. ఇంతలో దానిచెంతనే ఒక "ఆంటి పెర్సనలు" బాంబుపడెను. బలవీర శింగు, నెం. ఎ. ఎ. 5122 గన్నరు, ఫిరంగి దగ్గరగ నిలచియుండెను. అతనికి తొడలో గాయమయ్యెను. అతను చేతిలో మందు తోటాలు ఫిరంగి ప్రేల్చేవాని కందిచ్చుటకు సిద్ధముగ పట్టుకొనియుండెను. అతని ఒక కాలు నిరుపయోగమయి పడిపోయెను. కాని చేతిలోనున్న తోటాలను ఎత్తి పట్టుకొనియే ఫిరంగిచెంతకు ప్రాకిపోవ ప్రయత్నించుచుండెను. మరి యిరువురు గూడ చాల గాయపడిరి. ఇంతలో మరొకడు పై యజమాని ఉత్తరువులకు ఎదురు చూడకుండానే, ఫిరంగి ప్రేల్చే స్థానంలోని కురికి కూర్చొనెను. వేరొకడు గుండ్లు అందిచ్చేచోట నిలచి సహాయం చేయుచుండెను.

ఇంతలో పక్కనున్న గడ్డికి నిప్పంటుకొనెను. ఆ మంటలు మందుగుండున్న పెట్టెలవద్ద కెగ ప్రాకుచుండెను. ఆ మంటలార్పమని నే నుత్తరువు చేసితిని. ఒకడు తన ఉక్కు టోపీతోనే ఒక కర్ర పెట్టెనంటుకుంటున్న మంటలార్పి దాని భద్రపరచెను. ఈ పనికాగానే తిరిగి ఫిరంగి వద్దకుపోయి సిద్ధముగానుండెను. టెలిఫోనులో మాట్లాడేవాడు, క్రింద మంటలార్పుచు, వాటిపైనుండి కుప్పిగంతుల వేయుచునే తలపై టెలిఫోను యంత్రం చెవులకు తగిలించుకొని పనిచేయుచుండెను.

గాయపడినవారి సంగతి మరీ అద్భుతంగానుంది. వారిలో ఒక్కడైనా దెబ్బతగిలినట్లు ఫిర్యాదు చేయడంగాని, సహాయం కోరడంకాని చేయలేదు. అంతా "బిల్కులుఠీక్" అంటూ జవాబు చెప్పడంవలన ఎవరికెంత దెబ్బ తగిలిందో తెలుసుకోడం కష్టమయింది. ఒకనికి విశ్రాంతి తీసుకోమని ఉత్తరువుచేస్తే, ఉత్తరువులనుల్లంఘించి, తిరిగి ఫిరంగివద్దకు వచ్చెను.

ఈ జట్టుకిచెందిన హవిల్దారు షాములాలునకు గన్నరు బలవీరశింగుకు ఐ.డి.ఎస్. మెడల్సు ఒసంగబడెను. ఈ దళానికి చెందిన అందర సైనికులు మెడల్సు పొందదగినవారే అయినా అందరికి యిచ్చుటకు వీలులేదు.

## సైన్యానికి చిల్లర సామానులు.

### ఇండియానుండి విశేషముగా కొనుట మరికొన్ని క్రొత్త సరకులు తయారుచేయుట.

7,000 లక్షల ఇనుప గుండీలు, 400 లక్షల అగ్గిపెట్టెలు, 380 లక్షల రబ్బరు గుండీలు, 200 లక్షల పౌనుల సబ్బు, 185 లక్షల ఉక్కు రింగులు, 85 లక్షల పౌనుల పెయింటు రంగు, 80 లక్షల చెవి కవచాలు, 50 లక్షల చదరపు అడుగుల కంపుల రేకు, 80 లక్షల సీసా మూతలు, 30 లక్షల ఇత్తడి రింగులు, 25 లక్షల చాకులు, సుమారు 10 లక్షల కప్పులు, సాసర్లు, ప్లేట్లు అనేకం గుర్తు బిళ్లలు, కార్డులు, గ్యాసు ప్రాణవాయువు, ఆంబులెన్సు మోత మంచాలు, కత్తెరలు, చమురు డబ్బాలు, ఉక్కు బ్రషులు, లక్క, లోహం పాలిషు, సిమెంటు, మున్నగు వస్తువులు ఎన్నో సప్లై శాఖవారి మిసలేనియసు స్టోర్సు డైరెక్టోరేటువారు, యిటీవల కొన్ని వారాల నుండి ఇండియాలో తయారు చేయించుచున్నారు.

నవంబరు, డిసెంబరు మాసములందు యీ డైరక్టరేటు వారికి 700 పెద్ద ఆర్డరులు వచ్చినవి. ఇందులో నాలుగోవంతు విదేశాలకు పంపుట కొరకే. వీటి సంఖ్యలు, రకాలను గమనిస్తే, ఎన్ని విపరీతమయిన వస్తువులు ఎంత ఎక్కువగా యీ దేశంలో తయారవుతున్నాయో తెలియగలదు. 1,000 రకాలు యీ డైరక్టరేటు ద్వారా పోతున్నాయి.

గత కొద్ది మాసాలలో ఇండియాలో తయారు చేయించిన క్రొత్త సామాను లేమనగా : కుట్టుపని యంత్రాలు, బైసికిల్సు, వాటి భాగాలు, పాలుపిం యంత్రాలు, అట్టపెట్టెలు, ప్లైవుడు పెట్టెలు, పండ్ల తోమే బ్రషులు, అద్దం బదులు అటువంటి వస్తువు జీలుగు బెండ సామానులు, కర్ర పూలు ఇంక లేటింగు బోర్డు, సూదులు, మైనం, రబ్బ గొట్టాలు, రబ్బరు గాలి తిత్తులు, మంచు సంచుల వేడినీటి సంచులు, రబ్బరు వాషరులు, పారాషూటులు పడవేసే పెట్టెలు, చెడువాయువు కనిపె సాధనాలు.

సైన్యానికి కావలసినటువంటి దుప్పటులు సాలీ, 2,500,000 వరకు ఇండియాలో తయా చేయబడుచున్నవి.

## జపాను బాంబులు.

జపాను విమానాలు "ఆంటి పెర్సనలు" బాంబులను ఉపయోగిస్తున్నాయి. అంటే వ్యక్తికి హాని కలుగజేసేవని అర్థం. ఈ బాంబులు సైనిక శిబిరాలనుగాని, భవనాలనుగాని పాడుచేయడానికి పనికి రావు. ఈ బాంబు ప్రేలేచోట మనుష్యులు గోతిలోగాని, గోడ చాటునగాని దాగొంటే ఏమీ చేయవు. ఆరు బయట మనిషి వుంటే చాల అపాయం. మనుష్యులు గుమిగూడియున్నచోట యిది పడితే భీభత్సం కలుగజేయును. ఈ బాంబు నేలను 2 అడుగుల గోయిమాత్రం కలుగజేయును. తునకలు కిరణాల వలె పై కెగిరి ప్రక్కనున్న మనుష్యుల నడుముల వరకు తగులును.

రంగూనులో యీ "ఆంటి పెర్సనలు" బాంబులవలన ఏ భవనము చెడిపోలేదు. ఈ బాంబులతో దాడి జరిగినపుడు మనుష్యులు దాగోడం చాల అవసరం.

### సవరణ.

ఫిబ్రవరి 6 వ తేది యుద్ధ సంచికలో ఆఖ పేజీయందు సైన్య విభాగములు అను వ్యాసం డివిజనులో సుమారు 12,000 సైనికులుంటా అనుటకు బదులు 1,200 అని పొరబా ప్రకటింపబడినది. పాఠకులు సవరించి చద కొన ప్రార్థన.

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.